# గురుస్మరణలో...



బూదరాజు రాధాకృష్ణ 88వ జయంతి సందర్భంగా శిష్యుల కవితాసంకలనం

**బూరా బృందం**

# ‘గురుస్మరణలో..’ పుస్తకావిష్కరణ





శ్రీ బూదరాజు రాధాకృష్ణ గారి 88వ జయంతి సందర్భంగా, 2 మే 2020 నాడు, అమరావతి తాడేపల్లిలోని క్యాంపు కార్యాలయంలో బూరా బృందం వెలువరించిన ఈ-బుక్ ను ఆవిష్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహన్ రెడ్డి. చిత్రంలో బూదరాజు గారి శిష్యులు కురసాల కన్నబాబు, సజ్జల రామకృష్ణారెడ్డి, జివిడి కృష్ణమోహన్ తదితరులు.

బూదరాజు రాధాకృష్ణ 88వ జయంతి సందర్భంగా

# గురుస్మరణలో..

ఈనాడు జర్నలిజం స్కూలు శిష్య బృందం కవితాసంకలనం

సంపాదకులు :

**మధుసూదన్ పమిడికాల్వ**

**కె.ఎ. మునిసురేష్ పిళ్లై**

**డాక్టర్ ఎస్.రాము**

**బూరా బృందం**

ప్రచురణ

తేదీ 3 మే 2020

# గురుస్మరణలో

బూదరాజు రాధాకృష్ణ 88వ జయంతి సందర్భంగా.. తేదీ 3 మే 2020
ఈనాడు జర్నలిజం స్కూలు శిష్య బృందం కవితాసంకలనం

# Gurusmaranalo...

poetry
on the eve of 88th Birth Anniversary of Budaraju Radhakrishna 3rd May 2020


తొలి ప్రచురణ : 3 మే 2020

ఫార్మాట్ : పీడీఎఫ్ - ఈబుక్

కాపీలు : అగణ్యం

సంపాదకులు :
**మధుసూదన్ పమిడికాల్వ**
**కె.ఎ. మునిసురేష్ పిళ్లె**
**డాక్టర్ ఎస్.రాము**

ముఖచిత్రం : కె.ఎ.మునిసురేష్ పిళ్లె

కవర్, లేఅవుట్ డిజైనింగ్ :
ఆదర్శిని మీడియా, హైదరాబాద్

వెల : అమూల్యం



కాపీలకు : (contact for e-book, flip book links)
మధుసూదన్ పమిడికాల్వ 99890 90018
కె.ఎ. మునిసురేష్ పిళ్లె  99594 88088
డాక్టర్ ఎస్.రాము 94401 02154

# నిత్యస్మరణీయుడు

సంస్కృత ఆంధ్ర ఆంగ్లాలలో సమాన పాండిత్యం, అటు భాషా శాస్త్రంలోనూ, ఇటు సాహిత్యంలోనూ సమాన కృషి, అటు పరిశోధనలోనూ, ఇటు బోధనలోనూ సమాన సామర్థ్యం, ఒకవైపు ఎంత అణచుకున్నా అణగని పద్యరచనా చాపల్యం, ఎదుటివారిపై ఎంత తేలికగా ఛలోక్తులు విసరగలడో, తన పైనా అంతే అప్రయత్నంగా ఛలోక్తులు విసురుకోగలిగిన హాస్య ప్రీతి, గంభీరాతి గంభీర ప్రసంగంలో అంతే గంభీరంగా ముఖం పెట్టి శ్రోతల్ని కడుపులు పగిలేటట్లు నవ్వించగలిగిన నటనా పటిమ, మరో నిమిషం మాట్లాడితే ఎక్కడ పడిపోతాడోనన్నట్లు కనిపిస్తూనే గంటలతరబడి ప్రసంగించే తత్త్వం, మాట్లాడడంలో ఎంత దుబారా అనిపిస్తాడో రాతలో అంత పొదుపరితనం, రాజీలేని పోరాట పటిమ, నిరంతర పరిశ్రమ, క్రమశిక్షణ, సమయపాలన - బూదరాజు రాధాకృష్ణ అనగానే కనులముందు కనిపించే లక్షణాలు.

తన భాషా సాహిత్య పాండిత్యంతో పాటు జర్నలిజం, న్యాయశాస్త్ర పరిజ్ఞానాలతో, చరిత్ర రాజనీతి సామాజిక శాస్త్ర వైదుష్యంతో ఏ విషయంపైనైనా అనర్గళంగా, ప్రామాణికంగా భాషించగల బూదరాజు రాధాకృష్ణ వంటి వారు ప్రస్తుత తరానికి చెందినవారు కాదు.

బహుముఖీనమైన పాండిత్యంతోపాటు, చమత్కారభాషణతో, విద్యార్థులపట్ల ఆప్యాయతతో ఒక దశాబ్దంపాటు ఈనాడు జర్నలిజం స్కూలుకు ప్రిన్సిపాలుగా పాఠాలు చెప్పారు రాధాకృష్ణ. మాట్లాడితే మర్డరు చేసేస్తానంటాడే తప్ప ఆయనది అమృత హృదయం, ఆపద వస్తే తన ప్రాణాలే అడ్డు వేస్తాడని ఆయన విద్యార్థులందరికీ తెలుసు. అందుకే ఆయనంటే వారికి ప్రేమే తప్ప భయం లేదు.

బూదరాజు రాధాకృష్ణ పరమపదించిన పదిరోజులకే ఆయన జర్నలిస్టు విద్యార్థులు 'సదాస్మరామి' అన్న సంస్మరణ సంచిక ప్రచురించారు. అదే చాలు వారిపై ఆయన ప్రభావాన్ని చెప్పడానికి.

ఆ తర్వాత ఆయన జన్మదినం జరుపుకున్న సందర్భాలు కొన్ని ఉన్నాయి. అయితే ఇలా ఆరోజూ ఈ రోజూ కాక జర్నలిస్టు విద్యార్థులూ, వారి గురుమిత్రులూ కలిసిన సందర్భాలలో ఆయనను సదాస్మరిస్తూనే ఉంటారు.

బూదరాజు రాధాకృష్ణగారు సదా మన మనస్సుల్లో మెదలాడుతూనే ఉన్నా అందరం కలిసి ఆయన పట్ల మన ప్రేమను పంచుకొనే సందర్భాన్ని కల్పించుకోవడం ఎంతైనా అవసరం. ఆయనకు ఎనభై ఎనిమిదేళ్లు నిండుతున్నాయి. ఈ సందర్భంగా మరోసారి స్మరించుకొనే ప్రయత్నం వారి శిష్యమిత్రులు చేస్తున్నారు.

'సదాస్మరామి' సంస్మరణ వ్యాస సంపుటం. ఇప్పుడిది కవితారూపంలో సంస్మరణ.

ఈ పిల్లలందరూ (మాకు పిల్లలే కాని పెద్దలే) వృత్తి కవులు కాదు. బహుశా కొందరికి ఇదే తొలి కవిత అయినా ఆశ్చర్యం లేదు. తమ కవితా పాటవం చూపించుకోవడానికి రాసిన కవితలు కావివి. ప్రియ గురువును తమ కవితల పల్లకీలో ఊరేగించే ప్రయత్నం ఇది. గురు ప్రేమ నిజంగానే వారిలో వాసనారూపంగా ఉన్న కవితాహృదయాన్ని వెలికి తెచ్చింది. ప్రతి అక్షరంలోనూ వారి స్మృతి పథంలో చిరస్థాయిగా నివాసమేర్పరచుకున్న గురువే ప్రత్యక్షమవుతాడు.

బూదరాజు వ్యక్తిత్వం (రూపం, స్వభావమూ కూడా) విశిష్టం. అందుకే ఒకసారి చూసినవారు, కలిసిన వారు, మాట్లాడిన వారి మనస్సులపై ఒక ముద్రపడిపోతుంది, ఒక అభిప్రాయం ఏర్పడిపోతుంది. సాన్నిహిత్యం దాన్ని మరింత దృఢపరుస్తుంది. ద్వంద్వాతీతుడు కాబట్టి అందరికీ ఒక్కలాగే కనిపిస్తాడు. అందుకే ఈ కవితలు మన మనస్సుల్లో ముద్రించుకున్న బూదరాజునే మళ్లీ మళ్లీ మన కళ్లముందు ప్రత్యక్షం చేస్తాయి.

అటువంటి గురువుకు శిష్యులైన ఈ విద్యార్థులందరినీ అభినందిస్తూ, ఇటువంటి శిష్యుల స్మృతి ఫలకాలపై చెరగని ముద్రవేసిన ఆ గురువును వారితోపాటు స్మరిస్తూ....

**... దుర్గెంపూడి చంద్రశేఖర రెడ్డి**

*ఈనాడు జర్నలిజం స్కూలు మొదటి బ్యాచ్ తెలుగు అధ్యాపకులు*




బూదరాజు రాధాకృష్ణ గారు మరణించినప్పుడు,
శిష్యులు వెలువరించిన, అంత్యక్రియల సమయంలో హాజరైన
ఆయన మిత్రులు, అభిమానులు అందరికీ పంచిపెట్టిన
ప్రత్యేక సంచిక ముఖచిత్రం

*.. 4 జూన్ 2006*

# కృతజ్ఞతా కుసుమాలు

ఎవరికయినా అమ్మ తొలి గురువు. తరువాత ఎందరో గురువులు తోడవుతారు. కొందరు పాఠాలకు పరిమితమవుతారు. కొందరు తరగతి పాఠాలతోపాటు జీవితపాఠాలను కూడా బోధించి గురువుగా మార్గదర్శనం చేస్తూ ఉంటారు. నిజానికి గురువు చేయాల్సింది అదే. మాకందరికీ శ్రీ బూదరాజు రాధాకృష్ణ గారు అలాంటి గురువు.

ఈనాడు జర్నలిజం స్కూల్ ప్రిన్సిపాల్ గా కేవలం జర్నలిజమో, అనువాదాలో, వ్యాకరణమో చెప్పి వదిలేసి ఉంటే మేము బూ.రా.గారిని ఇంతగా స్మరించుకుని ఉండేవాళ్లం కాదు. మొత్తంగా మీడియారచన, జర్నలిజానికి మించి బతుకుతెరువుకు సంబంధించి ఆయన చెప్పినవే ఇప్పటికీ మాకు పాఠాలు. అత్యంత సరళంగా వాక్యం రాయడం ఎంత కష్టమో నేర్పింది ఆయనే. కొత్త పదాలు, పరిభాష పుట్టించేప్పుడు జాగ్రత్తలు నేర్పింది ఆయనే. ప్రామాణిక భాష కృతకంగా కాకుండా ఎదుటిమనిషితో మాట్లాడుతున్నంత అందంగా తీర్చి దిద్దింది ఆయనే.

బూ.రా.గారు మాట్లాడే ప్రతి మాటలో వ్యంగ్యం, అందం, నుడికారం తొణికిసలాడతాయి. ఆయనకు గురజాడ అంటే అమిత ప్రేమ. కాళిదాసు అంటే గౌరవం. కాళిదాసు కవిత్వంలో రెండు తప్పులు దొరకవచ్చు. మనం రాసే కవిత్వంలో రెండు ఒప్పులు దొరకవచ్చు- అన్నది ఆయన కొటేషనే.

ఆయన 88వ జయంతి సందర్భంగా గురుస్మరణగా ఒక కవితాసంకలనం వేద్దామని అనుకున్నాం. వివిధ బ్యాచులవారిని అడిగితే కొందరు రాశారు. రాసినవన్నీ బాగున్నాయని కాదు. రాయని భాస్కరుల కవితలు ఇంకా బాగుండవచ్చు. లాక్ డౌన్ నేపథ్యంలో మొదట వీటిని ఈ-బుక్ గా ఆవిష్కరించి, తరువాత పుస్తకంగా ముద్రించే ఆలోచన ఉంది. ఇందులో కవితలు రాసినవారు, ప్రోత్సహించినవారు, ఈ బుక్ రూపకల్పనకు శ్రమించిన మునిసురేష్ పిళ్లె కి కృతజ్ఞతలు చెబితే మనల్ని మనమే అభినందించుకున్నట్లు అవుతుంది. బూ.రా.గారిని లోతుగా అధ్యయనం చేసి, ఈనాడు జర్నలిజం స్కూల్లో తెలుగు బోధించిన శ్రీ డి.చంద్రశేఖర్ రెడ్డిగారు అడగగానే ముందుమాట రాసి మమ్మల్ని ఆశీర్వదించారు. శిష్యులుగా గురువుగారికి ఇవి కృతజ్ఞతా కుసుమాలు.

సంపాదకవర్గం:<br>
పమిడికాల్వ మధుసూదన్<br>
డాక్టర్ ఎస్. రాము<br>
కె.ఎ.మునిసురేష్ పిళ్లె



# మా.. స్టారు

ఆయన అక్షరాలు దిద్దించలేదు కానీ..
అక్షర దిద్దుబాట పట్టించాడు
'లౌక్యపు మాటలు' ఏ సంధి సారూ
అని ఆయనను అడిగితే
ఠక్కున చెబుతాడు కానీ..
లౌక్యపు మాటలు చేతకాని వాడు
కుండబద్దలు కొట్టడంలో ఆయనకు ఆయనే సాటి
మొహమాటం అసలు ఎరగని ఘనాపాఠి
ముఖస్తుతి తెలియనివాడు

ఆయనే మా భాషకు బాషా
ఒకసారి చెబితే వందసార్లు చెప్పినట్టు
ఇప్పటికీ ఆ భాషే బతికిస్తోంది
మాకు బతుకు నేర్పించిన బడి పంతులు
బడాయి తెలియని వాడు
లడాయికి వెనుకాడని వాడు
తెలుగు పత్రికలకి నిఘంటువు
తెలుగు నుడికారానికి దిశ నువ్వు
నేర్పించిన వాడు మరచిపోవచ్చు కానీ
నేర్చుకున్నోడు మరచిపోతాడా?
అందుకే మాస్టారూ
మీరు ఎప్పటికీ... మా స్టారు!

**... కురసాల కన్నబాబు**
1991 బ్యాచ్ విద్యార్థి
వ్యవసాయ, సహకార శాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం



# నిలిచి వెలిగే జ్ఞాన దీపం

జ్ఞాన సముపార్జన- ఓ సాధన
మేధోమథనం- ఓ కఠోరశ్రమ
అలసత్వం- ప్రగతి నిరోధక సూచిక
అహంభావం- అజ్ఞానానికి ప్రతీక

పంచినకొద్దీ పెరిగేది జ్ఞానం
తనకే దక్కాలనేది మూర్ఖుడి అజ్ఞానం

మెదడుకు మేత అందిస్తూ
కార్యశీలతకు సానపెడుతూ
ప్రగతిని పరికిస్తూ
ప్రతిభను పరీక్షిస్తూ
పుటం పెట్టే మాస్టర్ ఆయన
జ్ఞానం పంచిన గురువు ఆయన
నిలిచి వెలిగే జ్ఞానదీపం ఆయన!

**... వెంకటేశ్వర్లు జి.**
*1991 బ్యాచ్ విద్యార్థి*
*అసిస్టెంట్ ఎడిటర్, నమస్తే తెలంగాణ*



# గుండెల్లో నిలిచి...

ఆయనొక నిజం
ఆయనదొక ఇజం
జర్నలిజంలోని నిజాలనూ
నిర్భీతిగా నొక్కిచెప్పగల నైజం
ఆ అనుభవాలకూ...
విన్నంత, కన్నంత అంటూ
గురికి బెత్తెడు కూడా దూరం కానంత
నిక్కచ్చిగా లెక్కలేసి నిలబెట్టగలంత
నికార్సయిన మా మాస్టారు!
గుండెల్లో నిండిపోయారు
ఎప్పటి నుంచో అలాగే ఉండిపోయారు.
మనిషి గుండెల్లో
ఇలా నిలిచిపోవాలంటే...
ఆయన దేముడైనా అయి ఉండాలి
దేవుణ్నయినా ఎదిరించగల
ధీరుడైనా అయిఉండాలి...
ఏ పాత్రికేయుడికైనా
ఆయన ధీరుడే...
ప్రొప్రయిటరుకూ
వెరవని వీరుడే...
ఈ పుణ్యభూమిలో తెలుగుకు
ఆయన ఒక యుగకర్త
మా జీవన పయనంలో వెలుగుకూ
బూరా మాస్టారే
క్రియ, కర్త...!

... బొమ్మరాజు దుర్గాప్రసాద్
*1991 బ్యాచ్ విద్యార్థి, ఈనాడు, విజయవాడ*



# మాటలు నేర్పిన మాస్టారు

వాడుక మాటలవాడు-
మాటల వాడుకవాడు
        వచనానికి నిర్వచనమయినవాడు-
        భాషకు శాస్త్రమయినవాడు
శాసనభాషకు శిలాశాసనమయినవాడు-
భాషోత్పత్తికి భాష్యమయినవాడు
        నిఘంటువుల గుట్టు తెలిపి-
        వ్యాకరణం సంకెళ్లు తెంపి
గురజాడ అడుగుజాడను ప్రేమించి-
పట్టుపరిశ్రమ కవుల పనిపట్టి
        పద్యాలవెంట పరుగులు పెట్టి-
        సరళవాక్యాల్లో సేదతీరి
పదకోశాల పదసంపదలు పోగు చేసి చేసి-
మాండలికం మాటలదండలు గుచ్చి గుచ్చి
        వెంటపడితే అంతుచూసి-
        ప్రేమ పుడితే కలిసి నడిచి
భాషలో న్యాయం, న్యాయంలో భాషలను ఆవిష్కరించి-
భాషతెలియని జర్నలిజానికి భావమిచ్చి
        వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
        జర్నలిజం గురవే వందే బూరా పరమేశ్వరౌ

**-పమిడికాల్వ మధుసూదన్**
*1992 బ్యాచ్*
*హెడ్, ధాత్రి కమ్యూనికేషన్స్*

# నమో నమామి



వ్యంగ్యమే ఆభరణం మాటే మంత్రం
అక్షర భిక్ష  పెట్టిన 'ధర్మా' త్ముడు
కనిపెంచని తండ్రి
కనిపించి కదిలించే గురువు
మాటల వాడుకలో చురుక్కు
జ్ఞానసంపదలో చమక్కు
అందుకే మా బూరా మాస్టారు
నమో నమామి సదా స్మరామి

**-కె. శోభ**
*1992 బ్యాచ్*



# స్మరణం చరణం గచ్ఛామి

అక్షరం నోట్లో సిగరెట్ అయి కాలుతూ
మాకు వెలుగు అందించిన
జ్వాలా తోరణం ఆయన!
వ్యాకరణ తీరంలో కొలమానాల
అనుమానాలు తీర్చి
ముళ్ళు విప్పే కళ నేర్పిన మహనీయుడు
 ముళ్లపొదల్లో మల్లెతీగలను మాకిచ్చి
 ఆయన పొగలు పొగలుగా ఎటో వెళ్లిపోయారు
 ఊహాజ్ఞానం మాత్రమే వున్న మాపై
 భాషా జ్ఞానం కురిపించి నడిచిపోయారు
అక్షరాన్ని బొంగరంలా తిప్పే ఆట ఆయన నేర్పిందే
సాహిత్య లోకాన్ని సంకేత స్థలంగా మార్చిన విమర్శకుడు
ఆయనో నిద్రరాని కల
ఆయన పాఠం మాకు నిద్ర లేని కల
 అక్షరాన్ని సిలువగా మార్చుకొని
 ఎన్నితరాలు మోశాడో... ఆయన ఆత్మిక శ్వాసతో
 రగులుతున్న జ్వాలా తోరణాలుగా మారి
 వెలుగుతున్నాం
ఉడుకు రక్తం మూటకట్టుకున్న
మా వాక్యాల వెంట
ఆయన ఎర్రటి చూపుల చారలు
ఇంకా హెచ్చరిస్తూనే వున్నాయి ...
ఆయన బూద రాజు కాదు
బుద్ధిరాజు ....

**.. వల్లూరి రాఘవరావు**

*1992 బ్యాచ్ విద్యార్థి*

ఏబీఎన్ ఆంధ్రజ్యోతి



# వన్ అండ్ ఓన్లీ వన్... బూరా సార్!

(...అప్పటికీ... ఇప్పటికీ... ఎప్పటికీ...)

ఉక్కిరిబిక్కిరి అధినేతల గొంగట్లో...
ఊపిరి సలపని అక్షరాల అంగట్లో...
మీ గాలి ఇప్పటికీ వీస్తూనే ఉంది...
నిటారైన ప్రతి అక్షరం మీ పేరు తలుస్తూనే ఉంది!

క్లాసులో మీ పాఠం నిన్న గాక మొన్న విన్నట్టే ఉంది...
వార్తలో కవిత్వానికి వాతలు తిన్నట్టే ఉంది!
రచనా రహస్యాల వ్యాకరణం గుట్టు విప్పినట్టే ఉంది..
జీవన మార్గపు మర్మాలెన్నో చెవిలో చెప్పినట్టే ఉంది!



పనిలో... వృద్ధ జంబూక వనిలో...
కనిపించని యుద్ధాలెన్నో... రహియించని గాయాలెన్నో...
'సృజనాత్మక వార్తారచన... చెబితే చేతికి వచ్చేస్తుందా?
భాష తెలిస్తే... బడిపంతులు పత్రికకే ఆచార్యుడెలా అవుతాడంట?'
'ఏలిక'పాములెన్నో... తలలెత్తి కొట్టిన బుసలు...
మా వెనుకే మీకు వినిపించిన గుసగుసలు...
ఇంకా ఈ చెవుల్లో రింగుమంటున్నాయ్...
ఆ జ్ఞాపకాలు కళ్ళల్లో సుడులు తిరుగుతున్నాయ్!

కటువు మాట వెనుక దాగిన మీ మనసు చెరకు...
దీనార్తిలో శిష్యబృందానికి అది కలకండ పలుకు!
మీ జీవన గీతాసారం... మరువదు ఈ శిష్యపరివారం!

నరుడు... 'నారి గాడు'... సాక్షాత్ 'చైర్ మాను'డైనా...
బూరాలు ఊదద్దు... బాజాలు కొట్టద్దు...



నమ్మిన బాటలో రాజీ పడి జేజేలు పలకొద్దు...
క్లాసులో మీరు చెప్పిందేమిటి... చెప్పనిదేమిటి...
ఒకటా... రెండా... ప్రతి పాఠం మరో లోకపు మనోవీక్షణం...
అరుపదుల నిరంతర విద్యార్థిగా మీరు పెట్టిన అనుభవాల అక్షర భిక్ష...
ప్రపంచ పద్మవ్యూహంలో జీవితాంతం ఓ పెద్ద బాలశిక్ష!



అవును...
అందుకే... ఇప్పుడు 'ఊ...రంతా అనుకుంటున్నారు'
బూరా... అశేష శిష్యాళికి అక్షరాల విలువిద్య నేర్పిన...
ఆధునిక తెలుగు పత్రికాలోకపు అభినవ ద్రోణుడు!
ఏకలవ్య శిష్యులెందరో ఉన్నా... ఎవరినీ అంగుష్ఠం అడగని ఆచార్యుడు!!
ఆ ఉలి చెక్కిన ప్రతి శిల్పం... అక్షర శరసంధానంలో నేడొక అర్జునుడు!!

'విజేత'లను విడిచి... 'గ్రహీత'లను స్మరించే
ఈ లోకపు కీకారణ్యపు కిరాతార్జునీయంలో...
మీ మాటే... ఓ పాశుపతం!
అందుకే... బూరా
మిము తలుస్తాం... మనసారా!
సత్యం... ఇది మా మాట! అనునిత్యం... మీదే మా బాట!!
ఇది పత్రికాలోకపు పాకుడురాళ్ళపై... చెరగని మీ అక్షరాల శిలాశాసనం!
చెదిరిపోతున్న విలువల వలువల ముంగిట...
ఓ 'సబ్బు' గాడి (అకవితా) మరణ వాఙ్మూలం!!

ఈ గాలి ఎప్పటికీ వీస్తూనే ఉంటుంది...
నిటారైన ప్రతి అక్షరం మీ పేరు తలుస్తూనే ఉంటుంది!
అప్పటికీ... ఇప్పటికీ... ఎప్పటికీ...
యు ఆర్ వన్ అండ్ ఓన్లీ వన్... బూరా సార్!!

.. మీ రెంటాల వారి అబ్బాయి జయదేవుడు

*1992 బ్యాచ్ విద్యార్థి 9441371357*



# బూరా

తరగతికి వెలుపల
నల్లబల్లకి ఆవల

పుస్తకాలకి తరవాత
పాఠాలకి దూరంగా

పరీక్షల తదుపరి
మార్కుల అనంతరం

పట్టాల చిట్టచివర
జిజ్ఞాసకీ విజ్ఞానానికీ చేరువలో

కనిపించే ఓ ఆరా
బూరా

**... గోరా**

*గోపరాజు రాధాకృష్ణ*
*1992 బ్యాచ్ విద్యార్థి*
*స్టార్ మా టీవీ*



# అచ్చతెనుగు పలక!

ఆయన మాకు- అక్షరాల పూలు నింపిన సజ్జ!
భాషతో - ఓనమాలు దిద్దించిన ఒజ్జ!
వర్ణమాలకు వర్ణాలద్దిన వాడు!
వాక్యంలో జోక్యం చేసుకున్న వాడు!
భాషనే శాసించిన వాడు
భాషనే శ్వాసించిన వాడు!
ఆయన మాటొక పంచదార చిలక
ఆయన మాకొక అచ్చతెనుగు పలక!
ప్రపంచానికి ఆయన బూరా!
మా భాషా ప్రపంచాన్ని
శ్రుతి చేసిన తంబూరా!
పదాల సంపద పండించిన రాజు..
మా బూదరాజు!
అందరిలా అక్షరాల్ని
లక్షలుగా మార్చలేని బీదరాజు!
'బడు'లను - పాత్రికేయ బడుల నుంచి తరిమినోడు
నుడులను- మా బతుకు నా'నుడులు'గా మార్చినోడు!
భాషోద్యమానికి ఆద్యుడు
ఆ గిడుగు రాముడు!
మా భాషాధ్యయనానికి పూజ్యుడు
ఈ రాధాకృష్ణుడు!
ఆయన జ్ఞాపకం
మాతో నడిచినంత మేర ...
మా గుండెల్లో ఘోషిస్తూనే ఉంటుంది
పంతులు గారు వినిపించిన పదాల బూర!

**-పామర్తి హేమసుందర్**
*1992 బ్యాచ్ విద్యార్థి*



# మాస్టారూ!

మునగ చెట్టెక్కించి ముంచడమే నైజంగా మారిన ఈ ప్రపంచంలో
నేనేమిటో... ఎవరేమిటో... వాస్తవం మాత్రమే తెలుసుకునేలా చేసిన
బోధివృక్షపు నీడ... మీ అడుగుజాడ!
మనసు బాగోనప్పుడు అటు ఆఫీసుకి... ఇటు ఇంటికి వెళ్లలేక...
మీ ఇంట్లో ఆగిన సందర్భాలెన్నో!
అలాంటి ప్రతి సందర్భం నాకో పాఠం!
జర్నలిజమూ భాషా మీరు అందరికీ నేర్పిన అంశాలు...
నేను మాత్రం కొన్ని బతుకు పాఠాలూ నేర్చుకున్నాను...
దీనికెందుకు చెప్పాలని అనుకోక...
పక్షపాతం చూపాను పద్మా... అన్నారే...
ఆనాడే నా మనసు మీకు పాదాభివందనం చేసింది.
చిన్నదాన్ననుకోక... నా ముందు గుండె గది తలుపు తెరిచారు
ఇదమ్మా పరిస్థితి... అన్నారు...
తనదైన విద్వత్తు తాలూకు గుండె నిబ్బరంతో
ఎవరినైనా గడగడలాడించే మనిషి... మా మాస్టారని పొంగిపోయిన నేను...
అంతటి మనిషీ కంటతడి పెట్టడం చూసి... కదిలిపోయాను
ఆయన కష్టం తీర్చలేని అశక్తురాలినని కళవళ పడి...
దూరంగా పారిపోయిన పిరికిదాన్ని...
నన్ను క్షమిస్తారా మాస్టారూ?
తనని ఎత్తుకుని ఉన్న మీ ఫోటో చూసినప్పుడల్లా పాప అడుగుతోంది...
అమ్మా... ఈ తాతగారి దగ్గరకు మళ్లీ ఎప్పుడెళదాం... అని
దానికి సమాధానం చెప్పలేని అశక్తురాలిని చేశారే...
పద్మ నొకసారి రమ్మని గట్టిగా ఎవరితోనైనా చెప్పకూడదూ?
మరో నాలుగు మాటలు వినే భాగ్యం నాకు లేకుండా చేసి
మరోసారి పక్షపాతం చూపితే ఈ పద్మ తట్టుకోగలదని ఎలా అనుకున్నారు?

**- పద్మశ్రీ**

*1992 బ్యాచ్ విద్యార్థి*



# ధ్రువతార

గ్రాంథికమును దించి
గ్రామ పదములు పెంచి
పత్రికలకు పంచి
పాఠకులను పెంచి

గతము చెరిపి  గతిని మార్చి
సరికొత్త బాటలు పరిచి
పత్రికలకు పంచి
పాఠకులను పెంచి

బడుల బడుల నుంచి
వాక్య గతులను మార్చి
పద బంధముల తీర్చి
పరమ గురువై నిలిచి

పత్రిక ఏదైనా కానీ
ఈనాడు, ఏనాడైనా కానీ
పత్రికా జగతిలోన నీవే ధ్రువ తార
పాత్రికేయుల గురువు బూరా

**... సత్యానంద కుమార్**
*1992 బ్యాచ్ విద్యార్థి*

# గురుస్మరణ



1.
వేటపాలెం నుంచి
తేట తెనుగు బండెక్కి
భాగ్యనగరి యందు
యోగ్యుడై నిలిచేరు
చదువునాట మీరు
చరితార్థుడయ్యారు
అనితర సాధ్యం మీ కృషి
అతిశయోక్తి లేదు జ్ఞానర్షీ

2.
బండరాళ్ల వంటి
'బడు'ద్ధాయిలకైన
మాటల మూటలు విప్పి
వ్యంగ్య గుళికలు గుప్పి
భాష మెలికలు మప్పి
నాటుకునేలా చెప్పి
నాలుగు ముక్కలు నేర్పి
నగిషీలు చెక్కిన శిల్పి

3.
అవధానిలా మీరు
సావధానంగా చెబితే
పృచ్ఛకులమై మేము
గుచ్చి గుచ్చి అడిగేము
వలిచి... వాత పెట్టి



చురకలేస్తూనే మీరు
నడక నేర్పిన తీరు
మరువలేం సారూ
మము దిద్దిన మాస్టారూ

4.
తమాషాల తాలింపు
విజ్ఞానపు కలగలుపు
అజ్ఞానులకు మేలుకొలుపు
నోట హాస్యం గుబాళింపు
మాట శాస్త్రాల మేళవింపు
మీ పాఠం ఆద్యంతం ఇంపు
భుక్తాయాసం బలాదూర్
నిద్రా గిద్రా ముందే పరార్

5.
శాస్త్రమేదైన గానీ
పంతమ్మె మీ బాణీ
జనభాష... దేవభాష...
పరభాషలే గాక
తరచి లోతుల చూడ
పరమ ప్రీతి మీకు
అధ్యయన వాసీ
అక్షర సోమయాజీ

6.
బాస గోసలు గాంచి
యాస ప్రాసలు ఎంచి
మాండలికమున ముంచి
వగరు పిందెల తుంచి



మెరుపుల రంగరించి
విషయ విలువలు పెంచి
విన్నంత విన్నాణం పంచి
జోహారిదే భాషా విపంచీ

7.
వేమన్న జాషువా
గురజాడ తీరున్న
జీవభాష నుడివిన
జానపదులే మిన్నని
మీరు మెచ్చిన సాహిత్యం
పులు కడిగిన ముత్యం
మీరు తెగడకుంటే పుణ్యం
పొగిడిన వారి జన్మధన్యం

8.
బతుకు తెరువు కాదది
బాస మోసులెత్తే బరువు
ఏ పీఠమెక్కినా ఎవరెదురైనా
మాజీ అయిన గాని రాజీయే లేక
చెణుకుల జోడించి రాత
చెర్నాకోల ఝుళిపించి వాత
నిక్కంబు పలికేరు
నిగ్గదీసి కడిగేరు

9.
యథార్థ వాదం... లోక విరోధం
తగని సంగతులెల్ల ఖండించ తథ్యం
రంధ్రాన్వేషకుడని రాళ్లు రువ్వెనెపో



గ్రంథాశ్రమవాసికి నిందాస్తుతులేటికి?
స్వీయ లోపమెరుగని అల్పజనుల
స్వాతిశయ రీతి లెక్క సేయనేల?
తీరున్నొక్క గుణముల తోడ
మేరు నగధీరులే మీరు
మారు మాట లేదు మహర్షీ

10.
డిగ్రీలు, పీజీలు, డాక్టరేట్లున్నా
మాతృభాషలో మా స్థానమెక్కడని
మమ్ము మేమే ప్రశ్నించుకొనుచు
ఆరు నెలల పిదప అయ్యో అనుచు
ఏడాదైనా లేమని వగచుకొనుచు
పాఠమా అది జీవిత పాఠమె గాదె
నేర్చిన విద్యలన్ని ఒడుపుగా పట్టి
నెమరు వేసేము ఉసురు ఉన్న వరకు

11.
తెలుగన్నది పేరుకే
మీరు నేర్పినదంతా జీకే
పాండిత్యము లేకున్న గాని
ప్రథమ జ్ఞానమె మిన్నని
ప్రతి శాస్త్రమునందు
ప్రవేశము కావలెనని
భాషతో మొదలాయె పాఠం
బహుళ విజ్ఞాన సమ్మిళితం

12.
మీదు సమీక్షలయందు
చేదుకొంటిమి తెలుగు



వాటమైన వాదులాటలెల్ల
తేట భాషను తీర్చుటకె కదా
మీ రాత వాతలు కాస్త కరుకు
రాయ నేర్చిన లేదు బెరుకు
ఏళ్లెన్ని గడిచెనో చరితలోన
నోళ్ల నానుతున్న సద్గురు మీరు

13.
గురుతులెన్నని ఎంచుదు
మరపురాని మీ తలపులందు
మీరు పెట్టిన భిక్ష అక్షయంబు
వృత్తి చర్చలెల్ల మీ నామమె
నివృత్తి నిఘంటువూ మీ పాఠమె
బూ.రా. అను పేరు మనసారా
మది తలచని శిష్యులుందురా?
గురువర్యా చరణం గచ్ఛామి
ఆచార్యా సదా స్మరామి

'నలుగురు కూర్చుని నవ్వే వేళల
నా పేరొకపరి తలచండం'టూ
గురజాడలా నీవు నుడివినావా
మరపు రాదు మీదు పలుకుల తోవ
గుండె గుడిలో కొలువైన గురుదేవా

**- శ్రీనివాస భరణి గొడవర్తి**
*1992 బ్యాచ్ విద్యార్థి*



# గురుభ్యోనమః

**ఈజేఎస్‌కి పూర్వం..**
నాది.. గ్రామీణ ప్రాంత నేపథ్యం..
బడిలో దిద్దిన అక్షరమే సర్వమన్న భావం
ఆమాత్రానికే జ్ఞానినన్న అహంకారం
కంట్రీబ్యూటర్‌గా తలకెక్కిన గర్వం..
భాషలో తప్పులు వెతికే దుస్సాహసం
మితిమీరిన అతిశయాల అతిశయం..

**ఈజేఎస్ ప్రాంగణం.**
గురువు బూదరాజు గారి సమక్షం..
ఉద్దండ సహాధ్యాయుల సాహచర్యం..
అవగతమైంది..
నిరక్షర కుక్షినన్న వాస్తవం..
మెదడు శూన్యమన్న సత్యం
ఒప్పుని తప్పనుకున్న అవివేకం..
గర్వం ఖర్వమై.. జగద్విదితమైన క్షణం..
బాహుబలిని కాదు.. పిపీలకాధముడనన్న నిజం..

**ఈజేఎస్ ఆశ్రమం**
గురువుగారి నేతృత్వంలో..
అక్షరాలు చిందులేసిన ప్రదేశం..
నిత్య సాహితీ చింతనల భువన విజయం..
వెలుగులీనిన తెలుగు ఉద్యానవనం..
వెల్లువలైన మాతృ భాషాభిమానం..
మెదళ్ళు అక్షరభరితమైన లోకం..
గురువుగారు నేర్పింది జర్నలిజం..



ఒంటబట్టింది మాత్రం...
అమ్మభాషపై అభిమానం..

**ఈజేఎస్ అనంతరం**
నాకే తెలియని నేను..
నాకే పరిచయమైన చిత్రం..
నా ఉచ్ఛ్వాస నిశ్వాసల్లోనూ..
పదాల అర్థాల అన్వేషణే విచిత్రం..
మిత్రుల తెలుగు సందేహ నివృత్తికి..
నేను చిరునామా కావడం మరీ విడ్డూరం..
గురువుగారి సుముఖం
నా ఈ పరివర్తనకు కారణం..
ఇది అక్షరసత్యం.. మిత్రులెరిగిన వాస్తవం..

**గురుభ్యోనమః**
నాలో.. అక్షరమక్షరం పేర్చి..
క్షరరహితాక్షర దుర్గాన్ని తీర్చి..
ఖర్వస్థితిని గర్వస్థాయికి చేర్చి..
నన్ను జగతిన ఆవిష్కరించిన
గురువుగారికి వందనం..
మనసా శిరసా పాదాభివందనం..
నాలో ఉప్పొంగే అంతరంగం..
గురువు పాదయుగ్మానికే అంకితం..

సద్గురుమూర్తికి..
జన్మదిన శుభాభివందనం..

**... పి.విజయకుమార్,**
*1992 బ్యాచ్ విద్యార్థి*
*ఎమ్మిగనూరు, కర్నూలు జిల్లా.*



# ఆరాధ్యుడు

భాషణమే భూషణం
అక్షరమే ఆహార్యం
శోధన బోధన వాదన
ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
పఠనం నిత్యాగ్ని హోత్రం
పాండిత్యంలో మేరునగం
సరే సరి ఛలోక్తులు, చతురోక్తులు
ఉండవు అందు పునరుక్తులు
శిష్యజనులకు ఆరాధ్యుడు
విమర్శకులకు అసాధ్యుడు
అందరితో అనిపించెను ఔరా
ఆయనే మా అభిమాన బూరా

... ఇసికేల ఉదయ కుమార్
*1992 బ్యాచ్ విద్యార్థి*
*అనంతపురం*



# ద్రోణుడు

బొటనవేలు అడగని ద్రోణుడు
కులమతాలెంచని కౌటిల్యుడు
విలువలకు తలొంచే నిబద్ధుడు
బతుకువిద్య నేర్పిన గురుదేవుడు

ఛందోబద్ధ చీనాంబరాలు చుట్టిన
చంచల కానే కాదు ..
దీర్ఘ సమాసాలు, ఘనమైన సంధుల
నడుమ బందీ కాదు..
సాలెవాడు, రిక్షావాడు సైతం
దరువేయదగదే, బరువు కాదు
జనరంజకమైన వాడుకభాషే
తెలుగుజాతికి వేడుకని చాటాడు

తొలి అడుగు నుంచే మా
మాట, బాట తీర్చిదిద్దిన మార్గదర్శి
గురుదక్షిణగా తన్నొకపరి తలచిన
చాలన్న సౌజన్యమూర్తి
తెలుగు పాత్రికేయ సుక్షేత్రంలో
కలం సాగు చేసిన కృషీవలుడు
పుణ్యభూమి రుణం తీర్చుకొన్న
ధర్మారావూ.. మళ్లీ రావూ!

**.. జి.ఎస్.జమీర్ హుసేన్,**
*1992 బ్యాచ్ విద్యార్థి*
*మహబూబ్ నగర్*



# బూరాపై నా మాట

- 'నాకేమిచ్చావ్.. నాకేమిచ్చావ్' అని అంటే
  'నాకి ఏమీ ఇవ్వలేను' అనాలన్నా ఆయనే..!!
- 'నా రచన ఎలా ఉందో చెప్పండి గురువుగారూ..' అని
  అడిగితే 'మంచి అస్పష్టత సాధించావ్' అని మెచ్చుకోవాలన్నా ఆయనే..!!
- 'వింగడించడం' అంటే ఏమిటి గురువు గారూ?'' అని పాచిపళ్లు బయటపెట్టి
  వెటకారంగా అడిగితే
  నన్ను వంగోబెట్టి రెండు 'విభజించిందీ' ఆయనే...
- మూతి నున్నగా గొరిగించుకున్నవాడు 'గప్పా'లు కొడితే
  'లేని మీసం తిప్పకు..' అంటూ వెక్కిరించాలన్నా ఆయనే...
- కాకా రాయులది పట్టు పరిశ్రమగా అభివర్ణించాలన్నా ఆయనే
- కాళ్ల మీద పడడాన్ని 'కాళ్ల కింద తచ్చాడడం'గా మార్చి
  నవ్వులు పూయించాలన్నా ఆయనే...!!
- ''ఎక్కడో ఏదో విన్నాడు... బాగుంది కదా అని ఇక్కడ వాడాడు...'' అంటూ సందర్భోచితం
  లేకుండా పదప్రయోగాలు చేసి ఎత్తి ఏడుమైళ్ల దూరం పడేయాలన్నా ఆయనే...
- ''నలుగురు కూడి నవ్వే చోట నా గురించి ఒకసారి గుర్తు తెచ్చుకోమని'' కోరుతూనే
  కంటతడి పెట్టించాలన్నా ఆయనే...

''సాహిత్యపు రారాజు...
వ్యంగ్యోక్తుల 'వరద'రాజు
జ్ఞానంలో జనక రాజు
పాండిత్యంలో భోజరాజు
అభిమాన శిష్య గణాలకు మనసున్న మారాజు..
ఆయనే బూదరాజు
గురువుగారికి అశ్రునివాళి..

.. **టి.సత్యకుమార్**
*1992 బ్యాచ్ విద్యార్థి*



# మర్మమిదేరా!

గోటికింద గుండుసూదితో గేటు దాటలేరు
నొసలు చిట్లించి కాలరు పట్టేస్తారు కాపలాదారు
నెత్తిన మిషనెట్టుకెళితే గజరాజులవుతారు మీరు
మన మాష్టారి మాటల్లో మర్మమిదేరా

రూపాయి తినేటోడు రోడ్లకెక్కుతాడు
కోట్లు కూడబెట్టేటోడు చీకట్లో తైతక్కలాడుతాడు
అయ్యగారితో ఆడికి అరదండాలు వీడికి పూలమాలలు
మన మాష్టారి మాటల్లో మర్మమిదేరా

కొడవల్లేదు కమలమూ లేదర్రా
గొడవలాపి బ్లూ ఫాక్స్‌కు వెళ్లండ్రా
ఆలె గాడ్ని, పిల్లి గడ్డమోడ్ని చూడండ్రా
మన మాష్టారి మాటల్లో మర్మమిదేరా

గడ్డపారేసేటోడు గమ్మత్తేం చేస్తడు
గంప నెత్తి నెట్టుకొన్నోడేం మోసగిస్తడు
యంత్రం పేరిట మంత్రాంగం నడిపేటోడ్ని చూడు
మన మాస్టారి మాటల్లో మర్మమిదేరా

అయ్యోరు చెప్పేది అమ్మోరు పలికేది
మాయ మాటలే ముచ్చటించేది
మంత్రాలు, తంత్రాలతో తేలేదేముంది
మన మాస్టారి మాటల్లో మర్మమిదేరా

.. వెంకట రెడ్డి నాగా
*1992 బ్యాచ్ విద్యార్థి*
*సాక్షి, విజయవాడ*



# విద్యనేర్పిన విశ్వామిత్రుడు

అక్షరాల గనిలో అలుపెరగక
విజ్ఞానానికై అన్వేషించిన విద్యాశ్రామికుడు.

ఆశ - నిరాశల్లో
కలతలు రానివ్వక
నవవసంతాలను
తీసుకొచ్చిన తాత్వికుడు.

పదాల తోటలో
పెదవి విరచక
విద్యాకుసుమాలకై
చెమటోడ్చిన తోటమాలి.

తప్పొప్పుల ఉప్పెనల్లో
తలొంపులను స్పృశించక
తలెత్తి నడిపించిన
తామరాకు తత్వం.

చదువులమ్మ ఒడిలో
పరాక్రమాలు నేర్పి
చరిత్రను తిరగరాయించిన
రాజనీతి చతురుడు.

బడిబాటలో
బ్రతుకునంతా ఈడ్చి
భావిభవితకై తపించిన
వైతాళికుడు మా గురువు.

విద్యనేర్పిన విశ్వామిత్రుడు
వివేకం నేర్పిన సరస్వతీపుత్రుడు
మా గురువు... బూదరాజు రాధాకృష్ణ గారు

.. **యమ్.రఘునాథ్**
*1992 బ్యాచ్ విద్యార్థి, కడప*



# అనుక్షణం జీవిస్తారు...

అటెండెన్స్ తీసుకుని
పనిపూర్తయ్యిందనకుండా...
సిలబస్ పూర్తిచేసి
చేతులు దులుపుకోకుండా...
ఎగ్జామ్స్ పెట్టి
చాప చుట్టేయకుండా...
మార్క్స్ ఇచ్చి
కథ కంచికనకుండా...
సర్టిఫికెట్ ఇచ్చి
తంతు ముగిసిందనకుండా...

భాషాజ్ఞానాన్ని ఒలిచిపెట్టిన సారు
స్వానుభావాలు పంచిపెట్టిన మాస్టారు
బతుకు పాఠాలు నేర్పిన మా స్టారు
జీవనసారం ఉగ్గు పట్టిన గురు
అనునిత్యం మాతో జీవించారు
అనుక్షణం మాలో జీవిస్తారు
బూరా సారూ... మీకిదే మా జోహారు


**.. డాక్టర్ ఎస్. రాము**

*1992 బ్యాచ్ విద్యార్థి.*
*అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజ్ ఆఫ్ ఇండియా (ఆస్కీ) లో ఎడిటర్,*
*మేనేజర్ (పబ్లిక్ రిలేషన్స్ కమ్యూనికేషన్స్).*



# అడుగు జాడలు

కాలం తీరక తప్పదెవరికైనా అని అంతా చెబుతారు
కానీ మాకు కాలం విలువ చెప్పింది మాత్రం మీరే
చిన్నప్పటి నుంచి వ్యాకరణంతో రణం సాగింది
అక్షరాల తోరణం మాత్రం మీ నుంచే నేర్చుకున్నాం
ఆరుద్రను ఔపోసన పట్టానని అనుకున్నాను
అసలు పేరు అడిగి సెలెక్షన్ ఇంటర్వ్యూలోనే చిత్తు చేశారు

ఈజేఎస్ పుణ్యమా అని
సందుల్లో తిప్పించారు... సమోసాలు తినిపించారు
సంధులు నేర్పించారు... సమాసాల రుచి చూపించారు
అనువాదంలో ఎన్ని వధలు చేసినా కొందరిని వదిలేశారు
మాలాంటి వారిని మాత్రం చూసీ చూడకుండా ఉండలేకపోయారు

నేను రాస్తే తప్పులేవీ ఉండవనుకుంటాను...
అలాంటి పప్పులేవీ మీవద్ద ఉడకనివ్వలేదు
పట్టుబట్టి నేర్పించారు... ఒంటబట్టేలా చూశారు
మీ రూపమే తెలుగు భాషా స్వరూపం
మీ మాటల మూటలే మాకు శిరోధార్యాలు

**- వంశీ మోహన్ నర్ల**

*1993 బ్యాచ్,*

*న్యూస్ ఎడిటర్ హెచ్ ఎం టీవీ,*

*ఫోన్ నెం. 98489 02520*



# సమవర్తి

ఆయన చేతికి అయిదువేళ్లూ సమానమే
శిష్యులందరిపై ఆయన ప్రేమ సమానమే

జర్నలిజం-
ఒక సిద్ధాంతంగా మాత్రమే కాదు
బతుకు వేదంగానూ నేర్పిన మహనీయుడు
వృత్తి మెళకువలు
ప్రవృత్తి పొలకువలు
నర్మగర్భంగా నేర్పిన సుమనస్కుడు

ర్యాంకు విద్యార్థులైనా
వెనక బెంచీల వాళ్లయినా
గురుదేవుని దృష్టిలో వ్యత్యాసం ఎరుగం!

అందుకే ఆయన సమవర్తి...
చేతులెత్తి మొక్కుతోంది శిష్య జగతి!

**...ఉండ్రు నరసింహారావు**
*1993 బ్యాచ్ విద్యార్థి*
*ఈనాడు, హైదరాబాద్*



# 'బుధ' రాజీయం..!

సద్భాషను శ్వాసించిన ఓ మనీషి
శిలాక్షరాలను శోధించిన నవ రుషీ
ప్రచారార్భాట రహితం మీ ప్రస్థానం ... నిజం.. మాకెపుడూ ఓ ఆశ్చర్యం
వేళ్ల మధ్యన వేలాడే ఆ నిప్పు కణిక
మీ జ్వాలాలోచనకు నిత్య సూచిక
కచ్చితత్వానికి మీరు ప్రామాణికం...
ఇచ్చకాల మెచ్చుకోళ్లకు దూరం... నిజం... మీరెపుడూ మాకు ఓ ఆశ్చర్యం
కాకాల బాకాలూదని మీ మొండితనం
'పట్టు'ఒడుపులు తెలీని మీపాండిత్యం
తప్పుల లెక్కలు తేల్చే మీ నిర్మొహమాటత్వం
అంతుచిక్కని వారికది అహంకారం
ఆంతర్యమెరిగిన వారికది అలంకారం
మాటల మర్మం తెలిసిన మాంత్రికుడా
నమ్మిన బాటలో నడిచిన యాత్రికుడా
తెలుగు ఉన్నతిని కాంక్షించిన స్వాప్నికుడా
విన్నంతయినా కన్నంతయినా
ఉన్నది ఉన్నట్టు ఉటంకించిన వాస్తవికుడా
నవజాత పాత్రికేయులకు ద్రోణాచార్యుడా
మీ అడుగు జాడలు పట్టుకుని
మీ అస్తిత్వ వారసత్వాన్ని అణువణువు పొదుగుకుని
మీ పాఠాల పరిమళాలు అక్షరాల్లో అలుముకుని
ఇన్నేళ్లుగా పాత్రికేయ వృత్తిలో సాగుతున్నా..
అన్వేసి విషయాలను ఔపోసనం పట్టిన మీ అభినివేశం
మాకెపుడూ ఓ అంతుచిక్కని ఆశ్చర్యమే!


**... రామదుర్గం మధుసూదనరావు**

*1994 బ్యాచ్ విద్యార్థి.*

*సీనియర్ కోఆర్డినేటర్, సాక్షి జర్నలిజం స్కూల్*



# సదాస్మరామి

రాతిని నాతిగా మార్చిన ఘనత
ఆ రాముడిదైతే...
రాలుగాయిలను అక్షర సైనికులుగా
మలచిన మనీషి మా బూ.రా.

విలేఖరిని విలేకరిని చేసినా...
బడు- బడికి సెలవు ఇప్పించి
వాడుక మాటలే మాటల వాడుకగా చేసినా...
పలుమార్లు 'జరిగి'
పనికిమాలవద్దని హెచ్చరించినా...

దూరమై దశాబ్దాలు గడచినా..
అక్షరమక్షరంలో...
రాసే ప్రతి పదంలో..
కూర్చే ప్రతి వాక్యంలో..
వెన్నంటి నిలిచిన
నిలుస్తున్న
నిలిచి ఉండే
గురు బ్రహ్మ సదా స్మరామి!

**.. గిలియార్ గోపాలకృష్ణ మయ్యా**
*1994 బ్యాచ్ విద్యార్థి*
*న్యూస్ ఎడిటర్, సాక్షి*



# దాచుకున్నా గుండెల్లో పదిలంగా..

ఏడు నెల్ల పరిచయం నాది..
ఏమని వర్ణించగలను ఈ విజ్ఞాన ఖనిని..
చెరిగిపోని జ్ఞాపకం నాది..
ఎలా మరువగలను ఈ విశ్వామిత్రుణ్ని

అక్షరాలతో ఆడుకునే..
ఆట నేర్పిన అద్వితీయ గురువు..
భాషంటే.. గోదారి యాసొక్కటే కాదని
లోకాన్ని పరిచయం చేసిన మహనీయుడు..

బీడు బుర్రల్లో అక్షర దుక్కి దున్ని
విజ్ఞాన విత్తులు నాటి
వాడి బుర్రలుగా మలచి
ఫలసాయం ఆశించని కర్షక జీవి..

చెప్పేది గంటసేపే అయినా
గురి తప్పక గుండెల్లో నిలిచిపోయే
తూటాల్లాంటి పలుకులే
తన పరమాణువులకు పంచిన అతిపెద్ద ఆస్తి

తన శిష్యులను అత్యున్నత శిఖరాలపై నిలిపి
తాను మాత్రం ఈ నేలపైనే మిగిలి..
ఆదర్శ గురువన్న పేరొక్కటి జేబులో వేసుకుని
చిరస్థాయిగా నిల్చిపోయిన చిరంజీవి..

వెలకట్టలేని ఈ గురువుని దాచుకున్నా గుండెల్లో పదిలంగా..
మరువలేని ఈ సాహితీ సుమానికి
చేతులెత్తి నమస్కరిస్తున్నా వినమ్రంగా..

.. బెహరా శ్రీనివాసరావు

*1994 బ్యాచ్ విద్యార్థి*
*ఈనాడు, హైదరాబాదు*



# భాషా భూషణుడు

ఆవగింజ నుంచి అంతరిక్షము వరకు
అడిగిన తడవున వివరించు వాచస్పతి
తప్పులు తేటపరచి ఒప్పులు చెప్పి
రెంటి విభజనను విడమరచిన ఆచార్యులు
జవజీవముల తెలుగు భాషన
మరువరాని మాటలు చెప్పి
మాండలికపు సొబగుల శోధించి
వాడుకమాటల మూటలిచ్చిన అక్షరశిల్పి
తెలుగును ఆరాధించి నవరసమ్ములనాస్వాదించి
ఆ పరిమళమే శ్వాసించి అందుకోసం తపించి
శాసనాల నిగ్గుతేల్చి పదకోశమ్ముల రూపుదిద్ది
అక్షరాలా అక్షరసేద్యం చేసిన భాషాభూషణుడు
సంస్కృతాంధ్ర ఆంగ్లభాషా సవ్యసాచి
పుణ్యభూమికి కీర్తితెచ్చిన ధర్మజీవి
అవి ఇవియని ఎన్నెంచగలము
ఆయన ఘనత విన్నంత-కన్నంత!

**- మర్రెడ్డి గురవారెడ్డి**
*1994 బ్యాచ్ విద్యార్థి,*
*సాక్షి విజయవాడ*



# బూరా... అంటే ఆభరణం

బూరా అంటే ఒక ప్రేరణ
బూరా అంటే ఒక విజృంభణ
బూరా అంటే ఒక ఆలంబన!
బూరా అంటే ఒక స్ఫూర్తి
బూరా అంటే అక్షర దాహార్తి
బూరా అంటే సమున్నత కీర్తి!
బూరా అంటే నిండైన మాస్టారు
బూరా అంటే గలగల పారే సెలయేరు
బూరా అంటే సరిలేని సద్గురు!
బూరా అంటే నేర్పించే గడసరి
బూరా అంటే తీర్చిదిద్దే సొగసరి!
బూరా అంటే కలంయోధులకు పాఠం
బూరా అంటే అక్షరాలతో పోరాటం
బూరా అంటే క్రమశిక్షణ
బూరా అంటే సమగ్రబోధన
బూరా అంటే సంకల్ప సాధన!
బూరా అంటే శిఖర సమానం
బూరా అంటే నిలువెత్తు మంచితనం
బూరా అంటే ఓదార్చే పెద్దరికం!
బూరా అంటే భయం, అభయం!
బూరా అంటే గౌరవం
బూరా అంటే అధ్యయనం
బూరా అంటే సంస్కరణం
బూరా అంటే ఆభరణం

**... బండారు యాదగిరి,**

*1994 బ్యాచ్ విద్యార్థి, మన తెలంగాణ, సంగారెడ్డి ప్రతినిధి, 98489 97083*



# రారాజు

సూపర్ స్టార్.. రెబల్‌స్టార్.. మెగాస్టార్..
స్టార్లు ఎందరున్నా మా స్టార్ మాత్రం మాస్టారే

రాజులకే రారాజు మా బూదరాజు
భాషా సాధికారతకు ఆయనే తరాజు

విన్నంత విన్నాం.. కన్నంత కన్నాం
అయినా ఇప్పటికీ పరగడుపే

ఆ వాక్ ఝరి మరిన్ని తరాలకు అందితే..
వందల మంది ఆ చేతుల్లో రాటుదేలితే..

పాత్రికేయం మరింత సమున్నతం
పేరుపెట్టడం కాదు ఎవరి తరం

గురువరేణ్యా.. సదాస్మరామి
మీ పాదపద్మాలకు శిరసానమామి

**... పి.ఆర్.ఆర్. కామేశ్వరరావు**
*1994 బ్యాచ్ విద్యార్థి*
ఈనాడు, హైదరాబాదు



# సమర్థుడా... యోధుడా..!

నా అస్తిత్వమా
నా ఉనికికి సజీవ సాక్ష్యమా
నా ప్రహేళికల సమాధానమా
నా సందేహపు మరీచికల్లో
దాహం తీర్చిన ఒయాసిస్సా
సమర్థుడా.. యోధుడా..!

నిత్యం నా వేళ్ల సందుల్లోనించి
అద్భుతంగా జారిపోతున్న అక్షరమా
నా అన్నం కంచంలో మెరుస్తున్న మెతుకా..
సమర్థుడా.. యోధుడా..!

నిశ్చల నిర్జీవ తటాకంలో
అలల ప్రకంపనల సృష్టికర్తా
ఉద్ధృత మాటల ఝరీప్రవాహమా..!
నా జీవిక ఆధారమా
ముగింపులేని నా ఆలోచనల్లో నిత్య చక్రభ్రమణమా
నా దీర్ఘ దినం వెనుక, దీర్ఘ రాత్రిగా నను నడుపుతున్న
సమర్థుడా... యోధుడా..!

గాలిలా దూసుకుపోయినా
అగ్నిలా చెలరేగినా
కొండలా నిటారుగా.. దృఢంగా నిలబడినా..
అంతు చిక్కని రాత్రుల్లో
మిణుగురుల వెలుగులా నిలిచిన
నా జీవితపు దీపశిఖా..
సమర్థుడా.. యోధుడా..!
వందనం.. వందనం

.. క్రాంతీపద్మ
*1994 బ్యాచ్ విద్యార్థి, సాక్షి, నల్గొండ*



# ప్రభో..

"ఎంత మాత్రమున ఎవ్వరు తలచిన
అంతమాత్రమే నీవు!
అంతరాంతరము లెంచి చూడ
పిండంతే నిప్పటి యన్నట్లు"
...ఖరారే,
అన్నమయ్యకు దైవత్వం బోధపడే ఉంటుంది!
లేకుంటే,
నిన్ను చూడకుండా అలా ఎలా రాయగలడు?

త్యాగయ్యకు నీ పరిచయం ఉండే ఉంటే-
'చాల సరళమయ హేల, సుగుణ గుణశీల, బుధ శిష్య లోల, విధృత శర
జాల, శుభకర కరుణాల వాల, ఘన జ్ఞాన భవ్య మన మాలికాభరణ'
అని నుతించకుండా ఎలా ఉండగలడు?



జ్ఞానాంబుధి ఎదుట ఉంటే
దక్కేదెంత? విడచేదెంత?
మీమాంస ఎంత అసంబద్ధం?
గ్రోలడం-
శక్తి సామర్థ్యాలకు పరీక్ష అయినప్పుడు
దక్కనిది యావత్తూ అశక్తతే!!

అనుభవాల గనిలోకి అడుగుపెట్టాక
తవ్వుకున్నోడికి తవ్వుకున్నంత
మోయగలిగినోడికి మోయగలిగినంత!
సంపద కురచైపోయిందనే చింత ఎంత అర్థరహితం?
వెంట తెచ్చుకోలేకపోతే బలహీనతే!



భిక్షువుగా-
నీ మేధో వాకిట్లో
జోలె పట్టి నిలుచున్నప్పుడు...
నువ్వు ప్రేమగా విదిలించిన కబళమే
అక్షయమై ఇవాళ్టికీ కడుపు నింపుతోంది!
సుక్షతమై పరాకును దూరం తరుముతోంది!!

భాషా సంస్కారాలూ
వ్యవహార జ్ఞాన మర్మాలూ
బతుకు ఎత్తు పల్లాల దెబ్బల్ని తట్టుకోవడంలో...
నీ మాట...
తలపుల్లోంచి, మేం చేదుకుంటున్న ఊటబావి!
నీ పాఠం-
నిత్యానుష్ఠానమై తీర్చిదిద్దుతున్న శిల్పి చేతి ఉలి!

'బాస్ ఈజ్ ఆల్వేస్ రైట్'- న్యూటన్‌లా
నీవు నేర్పిన వృత్తిగత సిద్ధాంతాన్ని
'ప్రభువు మనసెరిగి నడుచు'కోవడమనే
ఆధునిక రూపానికి ఉన్నతీకరించుకుని...
ఆత్మహననం చేసుకోకుండా
ఏరోజు కొలువు చేస్తున్నాం మేం?

నీవొక జ్ఞాపకమా...
ఎపుడైనా మరచి ఉంటే కదా?
నీవొక పాఠమా-
వల్లె వేయకుండానే బుర్రల్లో ఇంకి ఉన్నావు కదా?

నీ సముఖంలో నేర్చిన దానికి -
నీ పరోక్షంలోనూ మెరుగులు దిద్దుకున్నాం!



సగం జీవితం చదివాకే
నీ చెంతకు వచ్చి చేరిన వాళ్లమే అంతా...
అయినా గురుస్మరణంలో
నీ ఒక్కడినే ఎందుకు తలచుకుంటున్నాం?

నేర్పినది కొంత
నేర్పకనే బోధపరిచినది కొండంత!
చివరకు, నీ తుదిశ్వాస కూడా
మాకు బతుకు పాఠమే అయింది!
బహుపార్శ్వాల నిస్సంగత్వమైంది!!



అక్షర భిక్ష
అక్షరమైన భిక్ష
అక్షరం- ప్రశ్నగా ఎదుట నిలిచిన,
ఏ క్షణం- నీ స్మృతిని తప్పుకోకుండా ఉన్నాం మేం!
అందుకే,
వినా గురుదేవం ననాథో ననాథః
సదా గురుదేవం స్మరామి స్మరామి

అహం దూరతస్తే పదాంభోజ యుగ్మ
ప్రణామేచ్ఛ యాగత్య సేవాం కరోమి
సకృత్సేవయా నిత్య సేవా ఫలం త్వం
ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో బూదరాజా

.. కె.ఎ. మునిసురేష్ పిళ్లె
*1994 బ్యాచ్ విద్యార్థి*
*ఆదర్శిని, హైదరాబాద్*



# అదొక్కటే గుర్తుంది!

ఆరు నెలలు తోమేశావు కదయ్యా!
దంత్యాలన్నావ్
తాలవ్యాలన్నావ్
తెలుగు కూడా గొట్టే
అని జీవితంలో తొలిసారి
తెలియజేశావ్

ఇంట్రోలు 24 రకాలు...
ఇంటర్వ్యూ ఇలా చేయాలి...

హెడ్డింగ్స్ లో do స్ & డోంట్స్...

ఇలా ఏవేవో చెప్పినట్లున్నారు...
ఒక్కటీ గుర్తులేవు గురూజీ!

25ఏళ్ల పనిలో అవి ఉపయోగపడ్డయ్యో లేదో కూడా తెలియట్లేదు
చంకలో ఎత్తుకొని చందమామని చూపాక
అమ్మ వేలుకు విలువలా...

ఆరు నెలల పాఠాలేమోగాని
ఆఖరి రోజు అంతా అయ్యాక
బాత్రూం దగ్గర దమ్ముకొట్టుకుంటూ
పిచ్చాపాటీగా...
మొండిగా (నాకు మల్లే అనే ధ్వనిలా) సిద్ధాంతాలంటూ
పట్టుకొని వేలాడితే జీవితంలో నష్టపోతారు...
అడ్జస్ట్, అడాప్ట్ అవ్వండి.... అన్నారు!

సారీ... ఇదొక్కటే గుర్తుంది గురువు గారూ!

.. రేగళ్ల సంతోష్ కుమార్
*1995 బ్యాచ్ విద్యార్థి*
*ఈనాడు, హైదరాబాద్*



# అనువాదం

'వద్' అనే ధాతువుకు అను అనే ఉపసర్గ చేరితే ఏర్పడిన మాట అనువాదం.
అనువాదం అంటే అర్థం... చెప్పిందే మళ్లీ చెప్పడం''
బూదరాజు గారూ! అప్పుడెప్పుడో మీరు నాకు చెప్పిన పాఠం ఇది
ఆ పాఠం నా మట్టిబుర్రకి ఆనాడు అర్థం కాలేదు.

పదిహేనేళ్ల తర్వాత ఇప్పుడు అర్థమైంది...
అనువాదం అంటే.. చెప్పింది మళ్లీ చెప్పడం
చెప్పిందే మళ్లీ మళ్లీ చెప్పడం.. చెప్పిందే మళ్లీ మళ్లీ మళ్లీ చెప్పడం
మొదటి క్లాసులో చెప్పిందే 70 వ క్లాసులో మళ్లీ చెప్పడం

నుండి వద్దు, నుంచి అని రాయాలని మళ్లీ మళ్లీ చెప్పడం,
రు, డు లను మార్చి మార్చి రాసి రూడ్‌గా గౌరవభంగం చేయొద్దని మళ్లీ మళ్లీ చెప్పడం,
కర్తకు, క్రియకు అన్వయం ఉండాలని మళ్లీ మళ్లీ చెప్పడం,
అనువాదాన్ని వదిలేసి అ, ఆలు మళ్లీ మళ్లీ చెప్పడం.
ఛీ ఛీ.. అనువాదాన్ని వదిలేశానని ఎలా అంటున్నాను?
మళ్లీ మళ్లీ చెప్పడమేగా అనువాదమంటే!

నేనో మేధావినేమోననే అనుమానం నాకుండేది
అనువాదం క్లాసుతో అది కాస్తా పటాపంచలైంది
నేనో పులి లాంటి వాడిననే పొగరు ఎక్కడో ఉండేది
నేను పెట్టించిన పులి గుడ్డు చూశాక అదీ పారిపోయింది
నా దారి నాదేనని నారాయణ మంత్రాలే ఫలించాయి
ఈ చండామార్కులకు సున్నా మార్కులే లభించాయి

నాలాంటి శిష్యుణ్ని ఈ దేశం మీదికి వదిలినందుకు మీకు వీరతాడు ఎలా వేయమంటారు?
అలాగని నా గురువైన మీకు గుండు సున్నా ఎలా వేయమంటారు?
మీరు చెప్పిన అనువాద పాఠం ఇప్పటికైనా నాకు అర్థమైనందుకు
మీకు పాస్ మార్కులు వేస్తా.. మీలా నేనూ పాసయ్యే రోజు కోసం
ఆశగా ఎదురు చూస్తా!

**.. వక్కలంక రమణ**

*1995 బ్యాచ్ విద్యార్థి, ఆంధ్రజ్యోతి, హైదరాబాద్*

*(Tiger ovulates అనే దాన్ని నా శిష్యుడొకరు ''పులి గుడ్డు పెడుతుంది'' అని అనువదించినప్పుడు 2009లో నన్ను నేను తిట్టుకుంటూ రాసుకున్న కవిత..)*



# చిరంజీవి

మానవ జీవితానికి అర్థం, పరమార్థం
జీవించడం... జీవించడం మాత్రమే
కానీ ఎలా?
సీటుకోసం, అధికారం కోసం,
తానాతందానా అంటూ
ఆత్మగౌరవాన్ని తాకట్టు పెట్టుకుంటూ
ఆత్మవంచన చేసుకుంటూనా?
ఎవరేమంటే నాకేం
నాకు నచ్చినట్టు
నా మనసు మెచ్చినట్టునా?
అలా మనసుకు నచ్చినట్టు
జీవించిన, జీవిస్తూనే ఉన్నవారు
బూదరాజు రాధాకృష్ణ
ఒక మనిషి మరణం
భౌతికంగా మరణించినప్పుడు కాదు
తననెవ్వరూ తలచుకోనప్పుడు.
కానీ,
ఆయన తనువు చాలించిన వెంటనే
స్మృతి  సంచిక వచ్చింది
మరెవ్వరికీ దక్కని గౌరవమది
ఇన్నేళ్లయినా ఇంకా ఇంతమంది
తలచుకుంటూనే ఉన్నారు
ఆయన మరణించారా?
చిరంజీవిగా జీవిస్తున్నారా?

**.. విశేష్,**
*1995 బ్యాచ్ విద్యార్థి*
సైకాలజిస్ట్, హైదరాబాద్



# గురువుగారికి నివాళి...

నెరిసిన తెల్లని జట్టు, పెదాలపై పొగలుచిందు సిగరెట్టు
అందమై నర్తించు నొసలు,మాటల గంగా ప్రవాహంబు
నిర్మల హృదయుండు, నిర్వేద మెరుగని నియోగి బాపనయ్య
శిష్యగణములో జ్ఞాన తృష్ణ మేల్కొలుపు బోధిచెట్టు
శాస్త్రముల్ సానబెట్టిన ఘనాపాఠి
శాసనముల్ శోధించిన చరిత్రకారుడు
కట్టుబొట్టుజూడ అచ్చంగా మా గురువుగారే
పోల్చుకున్నాములే.. ఆయన బూదరాజు

బోసినవ్వుతో బోధించెడి గీతాచార్యుడు
సమయపాలనలో సూర్యభగవానుండు
శిష్యులయింట సిరులు వెలిగించిన యశోవంతుడు
చింతబరిక చేతపట్టుకొనకనే పాఠాలునేర్పిన బడిపంతులు
చిన్నతప్పులున్న మన్నించిన పెద్దగురువు
విజ్ఞానము పంచిన విశ్వవిద్యాలయము
పరహితమతని పరమ మతము
ఆ పాదములే మాకు పరమ పదము
మా హృదయమందిరమున వెలుగు దీపమ్ము
బృహస్పతి సరిజోడు మా గురువుగారు!

**.. బొబ్బిలి శ్రీధరరావు,**
*1996 బ్యాచ్ విద్యార్థి*



# మళ్లీ గురువుగా రావాలి

బీజాక్షరాలు నారుపోసి
జ్ఞానధార నీరుగా పోసి
తెలుగు సాహితీ కోటలో
పాత్రికేయ పూదోటలో
శతవర్ణ అక్షర పుష్పాలు పూయించిన
తోటమాలి.. ఆయనే

అక్షర మాలలెన్నో అల్లి...
విచక్షణ సువాసనలు అద్ది
సామాజిక స్పృహ గంధం రాసి
శిష్యులకు ప్రపంచానికి వారధిగా వెలసి
పాత్రికేయ తల్లికి అలంకరించిన
పరమ అక్షర భక్తుడు... ఆయనే

పత్రిక.. ఆలయాలు వేరైనా...
పత్రికలు తెలుగునాట నూరైనా
అక్షర దీపాలన్నీ అవే...
జేగంటలూ ఆయనవే..
మరపురాని సాహితీదాసుడు... ఆయనే

పాత్రికేయానికి పెద్ద బడి
సద్విమర్శకు కొత్త ఒరవడి
బాధితులకు విజ్ఞాన నిధి
ఆయన్ను శిష్యులుగా
ప్రతిదినం తలవడం మన విధి

మరోసారి గురువుగా రావాలని
కోరుకునేది.. ఆయననే!

**- పీరూ సాహెబ్,**
*1996 బ్యాచ్ విద్యార్థి,*
*ఈనాడు, కడప*



# అస్తుత దేవుడు

జర్నలిజం స్కూల్ మాస్టార్లలో
రుద్ర స్వరూపం!
నిర్మొహమాటంగా చురకలు తగిలించడంలో
'ధర్మ' స్వరూపం!
ఆధునిక తెలుగు జర్నలిజానికి వెన్నుపూస
మాట కాస్త కరుకైనా...
మనసు మాత్రం వెన్నపూస

గిడుగు నడిచిన బాట
వినుతి కెక్కిన దెంత?
కందుకూరి పలుకుబడి
పాడిగా వర్ధిల్లినది ఎంత?
గ్రంథ సంచయముల
మరుగులో దాగెరా

మనము పలికెడి మాటకు
మన్ననను దక్కించి,
వాడుక పదాలకే
అచిరమైన అస్తిత్వమిచ్చి
అస్తుత దేవుడిగా నిలిచెలే
అదిగదిగో మా గురువు బూరా

**... శశిధర్ సంగరాజు**
*1996 బ్యాచ్ విద్యార్థి*
*ప్రిన్సిపల్ సాఫ్ట్‌వేర్ ఇంజినీర్/ఆర్కిటెక్ట్, యూఎస్ఏ*



# మెట్లు దిగిన మాస్టారు

టైం మెషీన్‌లో వెళ్లాల్సి వస్తే నేను తప్పకుండా వెళ్లదలచుకున్న కాలం ఈజేఎస్ రోజులు. సరిగ్గా 25 ఏళ్ల క్రితం బూదరాజు గారి దగ్గర మా శిష్యరికం మొదలైంది. ఆయన మహాసముద్రం. ఆ విషయం మాకప్పుడు తెలియదు. ఈజేఎస్ ప్రిన్స్‌పాల్ గారిగా ఆయనంటే భయం, భక్తి, గౌరవం. అప్పట్లో రెండు సంఘటనలు ఈనాటికీ ఆయన్ని గుర్తుంచుకునేలా చేశాయి. నేను చేసింది అయిదేళ్ల లా కోర్సు. బిఎల్ డిగ్రీ ఫైనల్ ఇయర్ పరీక్షలు ఈజేఎస్ కోర్సు మధ్యలో వచ్చాయి. బూదరాజు గారు అనుమతి ఇవ్వలేదు. కావాల్సి వస్తే పూర్తిగా ఈజేఎస్ వదిలేసి వెళ్లిపొమ్మని కటువుగా చెప్పారు. చాలా బాధేసింది. ఆయనంటే భయం పెరిగిపోయింది. అదే సమయంలో డీటీపీ కంపోజింగ్‌లో అన్నీ తప్పులు చేస్తున్నానని నా పేపర్ ను ప్రింట్ తీసి మరీ క్లాసుకు తెచ్చారు- ఆ ఇన్చార్జి. నా ప్రాణం ఆగినంత పనైంది. దుఃఖం ముంచెత్తుకొచ్చింది. తరగతిలో నాది తొలి వరుస. బూదరాజుగారి చేతిలో నా పనైపోయిందనే అనుకున్నా. బూరా గారు మాట్లాడటం  మొదలుపెట్టారు. తన జీవితంలో ఎదుర్కొన్న కష్టాల గురించి ఒక్కోటీ చెబుతున్నారు. ఎక్కి ఎక్కి ఏడుస్తూనే ఉన్నాను. కాసేపటికి తన కష్టాలపైనే సెటైర్లు వేయడం ప్రారంభించారు. క్లాసంతా నవ్వుతోంది. నా కళ్లల్లో మాత్రం నీళ్లే. కొన్ని జోక్స్ కి నాకూ నవ్వొచ్చింది. ఆయన మనసు తేలికపడినట్టుంది. 'నెవర్ టూ లేట్ టు ఇంప్రూవ్', 'అన్‌వెల్‌కమ్ (ఫెయిల్యూర్) విజిటర్ విల్ నాట్ స్టే' అనే గొప్ప వాక్యాలతో ముగించారు.

నలభై నిమిషాల క్లాసు సమయాన్ని పూర్తిగా ఆయన నాకు కేటాయించారు. నన్ను నవ్వించడానికి అనేక రకాలుగా ప్రయత్నించారు. నేను క్లాసులో టాపర్‌ను కాను. ఆ గొప్ప మనిషి ముందు నేనో రేణువులాంటి దాన్ని అయినా నా కోసం ఆయన అన్ని మెట్లు దిగివచ్చారు. ఆ రోజును ఎప్పటికీ మరచిపోలేను.

**.. డి.పి. అనురాధ**

*1996 బ్యాచ్ విద్యార్థి*

*చీఫ్ సబ్ ఎడిటర్, ఆంధ్రజ్యోతి*



# గీతసారథి

నిష్ఠగా ఒక గీత గీయాలి
ముక్కుసూటిగా ఉండే గీత
మొహమాటం లేని నిలువుగీత
మొహం బద్దలుగొట్టే నిలువెత్తు గీత
ఆస్తికి అడ్డుగీత అంతస్తుకి నిర్లక్ష్యపు గీత
అధికారం వెంట్రుకకు పర్యాయపదమైన గీత
మనసుకు నచ్చని సమస్త దృగంశాలనూ
భగ్గున భస్మం చేసే బాక్సింగ్ పంచ్‌లాంటి గీత
పూజాద్రవ్యాల్లాంటి ఆ గీతలన్నిటినీ
భక్తిప్రపత్తులతో సమకూర్చుకుని
మనసుకాన్వాసుపై పరిస్తేగానీ
ఆ రూపం ప్రత్యక్షం కాదు!



అక్షరం అప్పుడప్పుడూ
తన అనుపానుల్ని తనే వేటాడుతుంది
ఆనాటి వేట వేటపాలెంలో మొదలైంది
బూదరాజు వారి ఇంటిగుమ్మాన్ని
సారస్వత తోరణాలతో అలంకరించింది
బుల్లి రాధాకృష్ణకు
వేటపాలెం గ్రంథాలయంలోని ఒక్కో పుస్తకాన్నీ
గోరుముద్దలతో కలిపి తినిపించింది
వేట వృథా కాలేదు
గ్రంథాలు నిరుపయోగం కాలేదు
ఆయనొక భాషాసాహిత్యాల నిఘంటువై
అధ్యాపకత్వం నుంచీ అకాడమీ అగ్రపీఠం దాకా
మౌలికసూత్రాల మూలవిరాట్టయ్యారు



పత్రికాభాషకు పెద్ద దిక్కయ్యారు
పాత్రికేయ పాఠశాలకు గురుపీఠమయ్యారు
వందలాది రాతశిలలను శిల్పాలుగా తీర్చిదిద్దారు



ఆయన చెప్పేదాకా
గీతల రహస్యాలు చాలామందికి అర్థం కాలేదు
వార్తకీ వర్ణనకీ మధ్య ఉండాల్సిన గీత
ఇంట్రోకీ కవిత్వానికీ మధ్య నిలబెట్టాల్సిన అడ్డుగీత
వాక్యాల మధ్య దాగి ఉండే అంతర్లీన గీత
విద్యుక్తధర్మం వెంట నీడలా సాగాల్సిన నిబద్ధ గీత
ప్రలోభాలను దాపునకైనా దరిజేరనివ్వకూడని సరిహద్దు గీత
బెదిరింపులను లెక్కల్లో ఎక్కడా చేర్చకూడని ధైర్యపు గీత...
ప్రతి గీతకూ పర్యాయపదాల్ని తయారుచేసి
మా జ్ఞానచక్షువుల్లో పదిలపరిచారు
గీతాసారాన్ని బతుకుపొరల్లో భద్రపరిచారు
అవును... ఆయన మాకు గీత బోధించారు
అందుకే బూదరాజు రాధాకృష్ణ నామాన్ని
మా జీవన దినపత్రికల నిండా అచ్చొత్తుకున్నాం!

**.. ఎమ్వీ రామిరెడ్డి**
*1996 బ్యాచ్ విద్యార్థి*
హెడ్, రామ్‌కీ ఫౌండేషన్, హైదరాబాద్



# ప్రతిజ్ఞ

తెలుగు భాషకు ఆయన- రాజ్యాంగం
పాత్రికేయ ప్రపంచమే- పీఠిక
సాగించిన భాషా శోధనలే- సవరణలు
అలంకారాలు, తర్కాలు- అధ్యాయాలు
పదాలు, పదబంధాలు- ప్రాథమిక హక్కులు
వాడుక మాటలు- శాసనాలు
ఆత్మాభిమానాలు- ఆదేశిక సూత్రాలు
వ్యవహారికం- సర్వసత్తాకం
వెలువరించిన పుస్తకాలు- ఆచరణీయ తీర్పులు
పదవైనా, ప్రాసాదమైనా- 'లిఫ్ట్'లెక్కని నైజం
ఆయనో మహా శిఖరం

సంక్లిష్ట పదాలతో పత్రికా భాషను
గరళం చేసిన వారినుంచి లాక్కొని
సరళం చేసి సామాన్యుడి
ముంగిటకు తీసుకువెళ్లిన మహనీయుడు
బూదరాజు గారికి
వేల వేల వందనాలతో...
ఆయన నిర్దేశించిన భాషా ప్రమాణాలను
స్థిరంగా పాటించడమే-
మా- ప్రతిజ్ఞ!

**.. డి. నారాయణ రెడ్డి**
*1996 బ్యాచ్ విద్యార్థి, ఈనాడు, హైదరాబాద్*



# గురుబ్రహ్మ

పేరు రాధాకృష్ణుడు
మనిషి భోళా శంకరుడు
అంతులేని విజ్ఞాన సర్వస్వం
అయినా.. అతి సామాన్య రూపం
దేనికీ వెరవని నైజం
వాగ్బాణాలు ఆయన సొంతం
ఆగని వాక్ప్రవాహం
అడుగడుగునా మాటల తూటాల వర్షం
ఆ విమర్శలకు కాదు ఎవరూ అతీతం
సృష్టించేవాడు బ్రహ్మ అయితే..
నిఘంటు సృష్టికర్త మీరూ బ్రహ్మే!
జీవితం ఇచ్చినవాడు విష్ణువైతే..
ఇందరికి పాత్రికేయ జీవితం ఇచ్చిన మీరూ విష్ణువే!!
నడిపించేవాడు మహేశ్వరుడైతే..
విద్యతో నడిపిస్తున్న మీరూ మహేశ్వరుడే!!!

గురూజీ...
ఆ ధూమపానం వీడనంటారు
మరణానికి వెరవనంటారు
చెప్పుల్లో కాళ్లతో సిద్ధమంటారు
అందుకే.. మీరు అంతుచిక్కరు
మీ మాట కఠినం
మనసు అమృతం
మీ వద్ద శిష్యరికం
మా పూర్వజన్మ సుకృతం
అందుకోండి మా నీరాజనం!

**- డాక్టర్ వెన్నెలకంటి ప్రదీప్ కుమార్,**
*1996 బ్యాచ్ విద్యార్థి, సీనియర్ రిపోర్టర్, ది హాన్స్ ఇండియా, తిరుపతి*



# ప్రణమామ్యహమ్!

సంఘదృష్టి ద్రష్టలార
ఔత్సాహిక యువకులార
పాత్రికేయ కలల బిడ్డలార
"మీ కోసం వ్రతం పట్టి
ఆకాసపు దారులంట అడావుడిగ వెళిపోయే
బోర విరుచుకుంటు వెళిపోయే
భాషా భేషజాల రథచక్రాల్
సంస్కృతాంధ్ర పటాటోప పదబంధాల్
భూ మార్గం పట్టిస్తాను... భూకంపం పుట్టిస్తాను"
అంటూ ప్రతిన బూనిన సింహనాదమై
తెలుగు పత్రికా భాషకు ఓంకార నాదమై
వెలుగొందిన మహనీయుడు
జర్నలిజం తెరువగా బతుకీడ్చు
శిష్య కోటికి ప్రాతఃస్మరణీయుడు
బక్కపీచు రొమ్ము విరిచి భాషాడంబరాల నడ్డివిరిచి
సామాన్యుల నోట ఆడు మామూలు మాట బాట నడిచి
పత్రికా జగతిచే సరళాక్షరమ్ము దిద్దించి
భాషా స్వరూపమను వేదమును నిర్మించి
యశము నర్థించక... విత్త మార్జించక
నిమిత్తమౌ పాత్రనే
యుక్తముగా ఎంచినట్టి
ధన్యజీవి బూరా!
సత్పురుషుని స్తుతింపగా
ధన్యత నొందాం మనసారా!

**... వట్టికూటి చక్రవర్తి**
*1997 బ్యాచ్ విద్యార్థి*
*జనసేన పార్టీ, హైదరాబాద్*



# గురువందనం

ఆర్తిని తొలిగించి.. జిజ్ఞాసను
చైతన్యమార్గం పట్టించిన వెలుగురేక
ఆశ్రయించిన మాత్రాన్నే అడ్డంకులు దాటించి
అడుగులు వేయించిన గురుమూర్తి
హృదయంలోని తేజస్సు
అక్షరంలోని ఓజస్సు
పలుకులోని మేధస్సు
శరీరంలోని సుషుమ్న ద్వారం
ఏక కాలంలో అనేక స్తరాలలో
ప్రవర్తిల్లిన మనీషి
వాగ్రూపంలో.. ప్రయోగ రూపంలో
ఆదర్శ రూపంలో..
అనేక జన్మలను ప్రసాదించిన కన్నతండ్రి
సందిగ్ధ జీవితంలోకి
ప్రవేశించిన వినూత్నాతిథి
పలుకుబడులకు శబ్ద వేది
పరిశోధకులకు తపోభూమి
నా పాలిటి సాక్షాత్ పరబ్రహ్మ
మన కాలంలో.. మన వేషంలో..
మన భాషలో.. మన జీవనంలో..
మన వెంట నడుస్తూ.. మనల్ని నడిపించిన
గురుమూర్తిని భుజంమీద నిలుపుకొని
చివరికంటా తీసుకెళ్లే పరమాణువులం మనం

**.. కోవెల సంతోష్ కుమార్**
*1997 బ్యాచ్ విద్యార్థి*
హైదరాబాద్



# పుణ్యభూమి ధర్మారావు

విద్యార్థి దశలో వామపక్ష భావాలతో ఉన్నప్పుడు పత్రికలు బాగా చదివేవాణ్ని. అప్పట్లో ఈనాడు పత్రికలో ప్రతి ఆదివారం ధర్మారావు పేరుతో ప్రచురించే 'పుణ్యభూమి' ఆర్టికల్‌ను క్రమం తప్పకుండా చదివేవాడిని. చదివి ఆనందపడే వాడిని. ఆ ఆర్టికల్ ను చదువుతుంటే ఇంకా చదవాలనిపించేది. ఆ భాష సామాన్యుడు మాట్లాడినంత సులభంగా, సరళంగా ఉండేది. మిత్రులం ఈ ధర్మారావు ఎవరు అని చర్చించుకునేవాళ్లం. విషయమేమిటంటే నేను ఈనాడు జర్నలిజం స్కూలుకు వచ్చేంత వరకు ఆ పుణ్యభూమి ఆర్టికల్‌ను ప్రిన్స్‌పాల్ బూదరాజు రాధాకృష్ణ గారే రాస్తాడని, తన కలం పేరు ధర్మారావు అని తెలియదు. అప్పటికే నేను పుణ్యభూమి వ్యాసాలకు బానిసను, వ్యసనపరుడిని. అలాంటి మహానుభావుడి దగ్గర జర్నలిజం పాఠాలు నేర్చుకోవడం నా జీవితంలో మరవలేని ఘట్టం.

### బూదరాజుగారి నిక్కచ్చితనం

జర్నలిజం స్కూలులో బూదరాజుగారి బోధనలో, మాటల్లో నేను గమనించినది నిక్కచ్చితనం. ఖచ్చితత్వం. మొహమాటం లేకపోవడం. ఏ వాస్తవాన్నైనా, ఎవరి ముందైనా కుండబద్దలు కొట్టేవారని తెలుసుకున్నాను. ఇప్పటికీ ఒక విషయం- సందర్భం వచ్చినప్పుడు నాకు మదిలో మెదులుతూ ఉంటుంది. అదేమంటే అప్పట్లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 'మద్యపాన నిషేధం' అమలులో ఉండేది. కానీ స్టార్ హోటల్స్ లో మాత్రం మద్యనిషేధం లేదు. రాష్ట్రమంతా మద్యనిషేధం అని ప్రకటించాక కొన్ని చోట్ల ఉండి, కొన్ని ప్రాంతాల్లో లేకపోతే మద్యనిషేధం ఎలా అవుతుంది. మద్యనిషేధిత రాష్ట్రంగా ప్రభుత్వం ఎలా ప్రకటించుకుంటుంది.. అని పత్రిక ఛైర్మన్ రామోజీరావు గారితోనే వ్యక్తిగత సంభాషణలో వాదించారు. విభేదించారు. అప్పటి వారిద్దరి వాదన గురించి స్వయంగా జర్నలిజం క్లాసులోనే చెప్పారు.

ఆయన సామాన్యుడు కాదు.. మహానుభావుడు అని తెలుసుకున్నాను. వందలమంది విద్యార్థులను జర్నలిజంలో పరిణతిగల వారిగా తీర్చిదిద్దిన బూదరాజు గారు.. తెలుగు పత్రికారంగం బతికి ఉన్నంత వరకు సజీవంగానే ఉంటారు.

**.. పోలూరు రాజగోపాల్**

*1997 బ్యాచ్ విద్యార్థి, హైదరాబాద్*



# విన్నంత కన్నంత

భాషకు భాష్యం చెప్పే శంకరుడు
మాటల మూటలు కట్టిన మన గురుడు
పాఠానికి పాటవం నేర్పిన ద్రోణుడు
కాళిదాసుకే కిరీటం పెట్టగల ధీశాలి..
సినారెను చిన్నబుచ్చగల చమత్కారి
తెలుగు శాసనాల పరిష్కర్త
మాండలిక  పదకోశ వ్యవహర్త..

పుణ్యభూమిపై ధర్మారావు..
సంస్కృతాంధ్రాంగ్ల భాషల సహవాసి
తెలుగు జాతీయాల తేనియతుట్ట..
చెణుకులాటలో చేయిదిరిగిన తుంటరి..
ప్రామాణిక భాషా శిఖరంపై ఒంటరి
శ్రీశ్రీని తలపించే పోశ్చర్..
చిన్నయ సూరికి నేటి సిగ్నేచర్..
పత్రికాభాషకు నవీన పంథా..

శిష్యరికంలో ఆయన చెంత..
విజ్ఞాన సర్వస్వం నేర్చుకున్నంత..
అనుభవ భాండం అందుకున్నంత..
ఆచార్యుని ఘనత...
అక్షరాల చరిత..
విన్నంత.. కన్నంత....!!

**.. కృష్ణసాయిరాం**
*1998 బ్యాచ్ విద్యార్థి*
*ఎగ్జిక్యూటివ్ ఎడిటర్, ఏపీ 24 బై7, విజయవాడ*



# మాట రాని పాడువాడను!

బూరా అంటే నాకు ఆగ్రహం..
దక్కలేదని ఆయన అనుగ్రహం..
క్లాసులో కూర్చొనేది మొదటి వరుస..
మార్కులు చూస్తే నాపై నాకే రుసరుస..
ఎందుకో గానీ క్లాసులు నాకు వంటబట్టలేదు..
అందుకే మాస్టారుకు నేనంటే అస్సలు గిట్టదు..
బూరా మాస్టారి
స్మోకింగ్ స్టయిల్ నాకిష్టం..
చేతులడ్డం పెట్టుకు నవ్వే ఆ స్మైలింగ్ నాకిష్టం..
ఆ మాటల జోరు నాకిష్టం...
చమత్కారపు హెూరు నాకిష్టం..
ఈ మాత్రమైనా రాయగలిగానంటే..
అదంతా ఆయన చలవేనని సుస్పష్టం..
అయినా బూరా అంటే నాకు ఆగ్రహం..
ఎంత చేసినా దక్కలేదని ఆయన అనుగ్రహం!
ఎవరినీ లెక్క చేయని ఆ తెంపరితనం నాకిష్టం!
ఎవరినీ విడిచిపెట్టని ఆ ప్రేమతత్వం నాకిష్టం!
ఆయన సింప్లిసిటీ నాకిష్టం!
అక్షరం అంతుచిక్కకున్నా..
మాస్టారి మాటలోని అంతరంగం
నా మనసుకు చిక్కింది! నను తట్టి లేపింది!
అందుకే ఆయనంటే నాకిష్టమైన ఆగ్రహం!
పాట పాడి అడ్డంగా బుక్కయ్యాక
కలిగింది కొంత అనుగ్రహం!
అదే నన్ను నడిపిస్తోంది ప్రస్తుతం!

.. **ఎన్.శివప్రసాద్ (ఎన్.ఎస్.ప్రస్)**

*1998 బ్యాచ్ విద్యార్థి, సంగీత దర్శకుడు*



# ఎరుగవేమిరా?

భాషా స్వరూపమా?
వ్యవహార కోశమా?
తెలుగు పత్రికాభాషకు
చుక్కాని ఏదిరా...?
ఎరుగవేమిరా.. అది బూరా!

మాటల వాడుకా- వాడుక మాటలూ
అర్థశ్లేషల అద్భుత విన్యాసాల తోడ
శిష్యకోటికి పరిణతి
నేర్పినది ఎవరురా?
ఎరుగవేమిరా... అది బూరా!

పత్రికా భాషకు తీరైన దారి చూపి
కట్టు తప్పని దిట్టపు రీతి నేర్పి
తీరుతెన్నుల చక్కగా నిర్దేశించిన
భాషా శాస్త్రజ్ఞుడు ఎవరురా?
ఎరుగవేమిరా.. అది బూరా!

ఒక దశాబ్ది పొడవునా
కలం దివ్వెలు వెలిగించి
పాత్రికేయ జగతిలో
ప్రభలు నింపిన దెవరురా?
ఎరుగవేమిరా... అది బూరా!

.. ముసునూరి శ్రీనివాసరావు
*1999 బ్యాచ్ విద్యార్థి*
*ఎగ్జిక్యూటివ్ ఎడిటర్, 10టీవీ*



# రివర్స్ మిర్చ్!

బతుకు నేర్పిన సారు
మెతుకునిచ్చిన సారు
గతుకు లేని దారి
వెతికి చూపిన సారు...
మా బూదరాజుగారు!

అదెలా?
"జర్నలిజం నీకు వచ్చేనో రాదో తెలియదు.
అక్షరపు నీ రాత కుదురుగా ఉండేనో లేదో తెలియదు.
పదాల కూర్పు- నేర్పు నీకు చేతవునో కాదో తెలియదు.
అందువల్ల...
నేర్పుతారిక్కడ కంపోజింగూ... క్వార్కూ.
రేపటి నీ తిండికి అదే స్పూనూ- ఫోర్కూ.
కాబట్టి అవి నేర్చుకో ముందు.
ఆ తర్వాత జర్నలిజమూ వస్తే... మరికాస్త పసందు"
అంటూ బతుకుపాఠం నేర్పిన సారు
మన బూదరాజు గారు.

వాళ్ల బండి నడిపినంతసేపు నువ్వో మొనగాడు.
వాళ్ల బండి నడిచినంతసేపు నువ్వే మనవాడు.
ఇవేవీ కుదరని నాడు...
వాళ్లు నిన్ననే మాట...
"ఎర్రనీ ఏగాణీ చెయ్యడు... వాడు మరి దేనికీ కొరగాడు"!
ఇన్ని లైన్ల బతుకుపాఠాన్ని 'నా రథీ రథనస్సుఖాః' అంటూ
ఒకే ఒక పదంలో చెప్పగలిగిన
మొనవాడి గలవాడు
పనితనపు మొనగాడు.



ఆ రూపూ రేఖ చూద్దాం రండి.
కారంకారంగా
చిరచిరలాడుతూ
మిరమిరలాడుతూ ఉండే
మిరపకాయ బజ్జీలా
నిలువుగీతలాంటి వాడు.
పొగరు ముచ్చికలా
పైన ఎక్స్‌ట్రా!

కాకపోతే...
మిరపకాయ బజ్జీలో
పిండి పైనుంటుంది.
మిరప లోనుంటుంది.

కానీ మన సారు తీరులో...
కారం పైనా... మమకారం లోన.
కరకుదనం ముందూ...
సరుకు నాణ్యం తర్వాత.
కాస్తంత రివర్సులో...
మిరప పైనా... పిండి లోపలా.
ఇక్కడ పిండి కొద్దీ రొట్టెకాదు...
ఆ పిండిని వాడుకున్న వాడికి
వాడుకున్నంత రొట్టె!
వాడుకోలేకపోతే
వాడి నోట మట్టే!!

**... యాసీన్,**

*1999 బ్యాచ్ విద్యార్థి*

*స్పెషల్ కరస్పాండెంట్, సాక్షి తెలుగు దినపత్రిక, హైదరాబాద్*



# వటపత్ర శాయికి అక్షరాల లాలి

పత్రికా రంగంలో ఆయనో వటవృక్షం
వటవృక్షం కింద మొక్కలు పెరగవట
చెట్లు, వృక్షాలకు చోటు లేదట
కానీ,
ఆయన వ్యవహార భాషా బోధి వృక్షం
వాడుక మాటల కల్ప వృక్షం
తెలుగు శాసనాలకు కదంబ వృక్షం
అందుకే ఆయన కీర్తి శాఖోపశాఖలు
ఆయన విత్తిన విత్తులు
మొలకెత్తాయి.. మొక్కలయ్యాయి
చెట్లుగా ఎదిగాయి.. కొన్ని వృక్షాలయ్యాయ్
సుగంధభరిత పుష్పాలను ఇస్తున్నాయ్
రుచికరమైన ఫలాలనూ అందిస్తున్నాయ్
వాడుక మాటల విత్తులతో
తెలుగు పత్రికలనే శాసించిన
వటపత్ర శాయికి అక్షరాల లాలి

.. సీహెచ్.ఎల్.ఎన్.శాస్త్రి
*1999 బ్యాచ్ విద్యార్థి*
ఆంధ్రజ్యోతి, హైదరాబాదు





యువతీ యువకులకిది నా విన్నపం.
భవిష్యత్తు మీది.
మా కాలం కుంటిగానో, గుడ్డిగానో గడిచిపోయినట్లే.
మానాటి అనుభవాలు మేం వినీ చూసీ చెప్పినవి మీకెంతవరకు పనికి వస్తాయో తేల్చుకోండి.
పనికి రావనిపిస్తే నన్ను శపించి మరిచిపోండి.
ఎలా జరిగినా నా రచనా ప్రయోజనం నెరవేరిందన్న
సంతృప్తి నాకు మిగిలి తీరుతుంది.
నాకదే పదివేలు.

.. **బూదరాజు రాధాకృష్ణ (1932-2006)**

# ‘గురుస్మరణలో..’ పుస్తకావిష్కరణ





శ్రీ బూదరాజు రాధాకృష్ణ గారి 88వ జయంతి సందర్భంగా, 2 మే 2020 నాడు, అమరావతి తాడేపల్లిలోని క్యాంపు కార్యాలయంలో బూరా బృందం వెలువరించిన ఈ-బుక్ ను ఆవిష్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహన్ రెడ్డి. చిత్రంలో బూదరాజు గారి శిష్యులు కురసాల కన్నబాబు, సజ్జల రామకృష్ణారెడ్డి, జివిడి కృష్ణమోహన్ తదితరులు.

# Gurusmaranalo...

# గురుస్మరణలో...

poetry

on the eve of 88th Birth Anniversary of Budaraju Radhakrishna 3rd May 2020

